# చైత్రకోకిల

**6**

విభవ శరత్తు

AUTUMN 1988



సంపాదకులు

తంగిరాల సుబ్బారావు

ఆర్వీయస్. సుందరం



చైతన్య కవితా వేదిక

బెంగుళూరు

CHIATANYA KAVITA a journal devoted to Telugu Poetry
Published by Chaitanya Kavita Vedika
R-2, Jnanabharati, Bangalore University Campus, Bangalore-56
October 1988, pp. vi + 52.

అక్షరాలంకరణ : డా. పి. సి. నరసింహారెడ్డి

వెల : రూ. 10-00 (వార్షిక సభ్యత్వం రూ. 15-00; ప్రత్యేక సభ్యత్వం రూ. 100-00; జీవిత సభ్యత్వం రూ. 200-00)

ఇతర వివరాలకు :

**Prof. T. V. Subba Rao**
Head of the Department of Telugu
Bangalore University
Jnana Bharati, Bangalore-560 056

రచనలు పంపాల్సిన చిరునామా :

**Dr. R. V. S. Sundaram**
Department of Telugu
I.K.S., University of Mysore,
Manasagangotri, Mysore-570 006

ముద్రణ :
మిత్ర ప్రింటర్స్, విద్యారణ్యపురం, మైసూరు-8

# "మానవ వికాసానికి కవిత్వం అత్యవసరం"

పై మాటలన్నది నొబెల్ బహుమతి పొందిన బ్రాడ్‌స్కి. ఈ మాటల్ని సహృదయులందరూ ఒప్పుకుంటారు. నొబెల్ బహుమానాన్ని స్వీకరిస్తూ బ్రాడ్‌స్కి చేసిన ప్రసంగానికి శీర్షిక ఇది. అయితే తన ప్రసంగాన్ని ప్రారంభిస్తూ బ్రాడ్‌స్కి మరో మాట అన్నాడు: "నియంతృత్వంగల దేశంలో బలైపోవడంకన్న ప్రజాస్వామ్యంలో పూర్తిగా విఫలుణ్ణి కావడం ఎంతో మేలు." తన మాతృదేశంనుంచి అమెరికాకు పారిపోయిన కవి వ్యక్తిగత అనుభవాలు ఈ మాటల్ని అనిపించాయనడంలో సందేహం లేదు.

బ్రాడ్‌స్కి అన్నా అక్మతోవ్ వాక్యాన్ని పేర్కొంటూ "నిరర్థకమైన దాన్నుంచి అర్థవంతమైన దాన్ని సృష్టించే అద్భుత ప్రక్రియ కవిత్వం" అన్నాడు. దీన్ని ఎవ్వరూ కాదనరు. వెంటనే నొబెల్ బహుమాన విజేత మరో అభిప్రాయాన్ని వ్యక్తం చేశాడు: "ప్రాచీన కాలంనుంచి ఆధునిక కాలం వరకు కవిత్వం ఉద్దేశ పూర్వకంగానో, అనుద్దిశ్యంగానో ప్రతిపాదించింది మానవుని వైయక్తికతను, వైశిష్ట్యాన్ని, భిన్నత్వాన్ని. ఎన్నో వస్తువుల్ని మనం పంచుకోవచ్చు-పరుపు, రొట్టెముక్క, నమ్మకాలు మొదలైన వాటిని; కాని కవిత్వాన్ని, కావ్యానుభవాన్ని కాదు. ఏ కళారూపమైనా, ముఖ్యంగా సాహిత్యం. అందులోనూ కవిత్వం-వ్యక్తితో నేరుగా సంబంధాన్ని కల్పిస్తుంది; అతనితో ముఖాముఖిగా నిలిచి స్వస్వరూపదర్శనం చేయిస్తుంది."

బ్రాడ్‌స్కి చెప్పిన మాటల్లో కొన్ని ఒప్పుకోగల్గినవీ, మరికొన్ని ఒప్పుకోలేనివీ ఉన్నాయి. కవిత్వాన్ని గురించి చెప్పే అభిప్రాయాలు అందరికీ ఆమోదయోగ్యంగా ఉండవన్నది నిజం. అయితే బ్రాడ్‌స్కి చెప్పిన ఈ మాటలు గమనించదగ్గవి. "రచయితల్ని శిక్షించడం, సెన్సార్‌షిప్, పుస్తకాల్ని తగలెయ్యడం-ఈ అన్ని నేరాలకన్న ఘోరమైన నేరం పుస్తకాల్ని చదవకుండా ఉండడం."

ఇకపోతే, చైతన్య కవితా వేదిక మూడు సంవత్సరాలు నిలబడి ఆరు సంచికల్ని తీసుకురాగలిగింది, సంతోషం. మూడు పువ్వులు ఆరు కాయలుగా వర్ధిల్లడానికి ఇది శుభసంకేత మనుకుందాం.

సంపాదకులు

# వేదిక నలంకరించిన కవులు

# వజ్రాయుధ కవిత

"వృద్ధజగతి సమాధిపై సమధర్మం ప్రభవించును;
నిద్దుర చీకటి వెలుపల వేకువ మెఱుకువ పుట్టును"

"జన్మెత్తిన మానవునకు
జీవితమే పరమధనం;
అయితే అది ఒకమారే
అతని కొసగబడిన వరం"

"ఉన్నదొక్క జీవితమే;
మానవునిగ వీరునిగా
బ్రతుకుము నరుడా!
చరిత్ర నీ కోసం
ప్రసవ బాధ పడుతున్నది!
భవిష్యత్తు నీ కోసం
పడిగాపులు పడుతున్నది!"

# మహాకవి సోమసుందర్

-డా. మిరియాల రామకృష్ణ

ఇతర సాహిత్య ప్రక్రియలెన్ని రాసినప్పటికీ, సోమసుందర్ ప్రధానంగా కవి. కవిగా ఆయనకు ఏభయ్యేళ్ల చరిత్ర ఉంది. విశిష్టమైన సాధన ఉంది. అచ్చయిన 15 కావ్యాలు సాక్ష్యంగా ఉన్నాయి. అరవయినాలుగేళ్లొచ్చినా ఇప్పటికీ ఆపాదమస్తకం అనుక్షణం కవిగానే ఆయన జీవిస్తున్నాడు. వర్గ శత్రువులమీద అక్షరాయుధంతో పోరాటం సాగిస్తూనే ఉన్నాడు. సోషలిస్టు ఉద్యమ కవిగా ప్రస్తుతవ్యవస్థమీద తిరుగుబాటు సాగిస్తూనే ఉన్నాడు. అది కేవలం తిరుగు బాటులా కనిపించదు; యుగధర్మాన్ని సూచిస్తూ అధర్మాలపై ఎర్రజెండా ఎగరేస్తూ ద్రోహులను బోనులో నిలబెట్టి నిప్పులు చెరుగుతున్నాడు. సోమసుందర్ అనే అగ్నిపర్వతంనుంచి ప్రవహిస్తున్న లావా తొలిదశలో వజ్రాయుధంగా రూపొందింది; తరవాత కాహళి అయింది. రక్తాక్షిగా మారింది. ఆ తరవాత చల్లారినట్లు విమర్శకులు భ్రమపడ్డారు. ఆయన కావ్యాలలోని ఎవల్యూషన్, రివల్యూషన్ చూడటం అశ్రద్ధ చేశారు. అసలు లావాకు బదులు అగ్నిపర్వతమే ప్రవహించనంత తిరుగుబాటు ఆయన 'బృహత్కావ్యాలు'లో ఉంది. అది చదివిన మేధావులందరూ తిరగబడే ప్రమాదముంది. అది సోమసుందర్ కవితా విశ్వరూపం. ధర్మగ్లాని సహించ లేక నేనే తిరుగు బాటుదారుగా వేషం మార్చుకుని వచ్చాననే మొండి దేవుడు సోమసుందర్. తన కావ్యవీధుల్లో శివమెత్తి తాండవిస్తున్న సోమసుందర్‌ను విభ్రాంతి, విప్లవం, చికిత్స, చైతన్యం కావలసినవారంతా చదవాలి. కసి, కోపం, ద్వేషం గలవారంతా చూడాలి. ఏదో సోమసుందర్ అంటే "సిల్కు లాల్చీవేసుకుని, సెంటు పూసుకుని, కూలీల మీద పద్యాలు రాస్తూ అహం భావంతో అరాజకంగా మాటాడతాడు అతడా?" అనుకునే వాళ్లు ఆయన ఇటీవలి కావ్యాలు మా ఊరు మారింది, ఆగతానికి శుభారంభం, సోమసుందర్ బృహత్కావ్యాలు, ఒక్క కొండలో వేయిశిల్పాలు చదివి, చెంపలు వాయించుకుని క్షమాపణ చెప్పుకోవలసి ఉంటుంది.

ఇంగ్లాండు వెళ్లొచ్చాకా సోమసుందర్ రాసిన "ఆంగ్లసీమలో ఆమని వీణలు" అనే కావ్యం అతడ్ని అంతర్జాతీయ స్థాయికి పెంచగలిగినంత గొప్ప కావ్యం. తెలుగు కవిత్వానికి ఇంగ్లాండునుంచి తెచ్చియిచ్చిన కోహినూరు వజ్రం. మరే భాషలో అయినా సోమసుందర్ 'బృహత్కావ్యాలు' 'ఆమని వీణలు' వచ్చి ఉంటే వాటిని రచించినందుకు జ్ఞానపీఠం ఇచ్చేవారు; నోబెల్ బహుమానం దిగివచ్చేది. పాపం సోమసుందర్ తెలుగు వాడయి పోయాడు. ప్రచారం చేసుకోవడం ఆత్మహత్యగా భావించే 'జ్ఞాని' అయిపోయాడు.

పైన పేర్కొన్న రెండు కావ్యాలూ చాలు సోమసుందర్‌ను ఈ శతాబ్ది అగ్రగామి కవిగానూ మహాకవిగానూ పేర్కొనడానికి. ఇది అతిశయోక్తి కాదు. నా కలం పొగడ్తకు అంగీకరించడం లేదు. వాస్తవాన్నే ప్రకటిస్తున్నాను. కావ్యాలు బాగా చదివాకనే ఈ నిర్ణయానికొచ్చాను.

సోమసుందర్ సహజకవి ఈ సమాజం అతడ్ని కవి చేసిందని చెబితే, అది సంకుచితశక్తి. అడవిలో పడేసినా ఈ కవి కవిత్వం చెప్పకుండా ఉండ లేడు. అది అతని జీవనధర్మం. అలాంటివాడు అడవిలాంటి ఈ శతాబ్ది సమాజంలో ఉన్నాడు. చూశాడు; రాశాడు. రాయడానికి ముందు వర్గకారుణ్యం, వర్గద్వేషం రెండూ కలిగాయి. మార్క్స్, లెనిన్ ఏం రాయాలో చెప్పారు. టాగోరు, చలం, కృశా, శ్రీశ్రీ ఎలా రాయాలో చెప్పారు. వ్యక్తినుంచి మహా వ్యక్తిగా మారాడు. దేశాలు తిరిగాడు. స్నేహాలు చేశాడు. మాటలు మధు వులూ అయ్యాయి; మంటలూ అయ్యాయి. ఎవరికోసం ఏవి కేటాయించుకో వాలో తెలుసు. చేతులు రెండు. కవనధారలు కూడా రెండే.

ఈ ద్వైవిధ్యం సమగ్రకవిలో సహజం ఇది మొదటినుంచీ ఉంది; ఇప్పటికీ పోలేదు. పోదు కూడా. పోతే, 'అందరిలాంటి విప్లవకవి గానే' మిగిలి పోయేవాడు సోమసుందర్.

సోమసుందర్‌కు కవిగా విశిష్టత ఉంది. భారతీయ భాషల్లో దేనిలోకైనా సులువుగా మార్చే గుణం ఆయన కవిత్వంలో ఉంది. భారత దేశమంతటికీ కావలసిన భావజాలమే ఇటీవలి కావ్యాలన్నింటా ఉంది. తెలంగాణా విప్లవం, ఆంధ్రరాష్ట్రోద్యమం—ఇవి చారిత్రకాలే; ప్రాదేశికాలే; వాటిని గురించి ఆందో ళన చేయడమే ఆనాటి విప్లవానికర్థం. కానీ ఈ నాటి విప్లవం దిక్కులనిండా ఆకాశంనిండా భూమినిండా నిండిపోయిన అధర్మం మీద తిరుగుబాటు. ఈ తిరుగుబాటు కొండ కోనల ఉద్యమాల ఊపిరికి పరిమితం కాదు అందుకే ఆ బాటలోనికి పోలేదు. ఆయన ఇటీవలి కావ్యాల్లో ఈ చర్చ ఈ వివేచన

అంతా వ్యక్తమయింది. విశ్వవిప్లవాన్ని సోమసుందర్ కోరుతూ 'బృహత్కావ్యాలు'లో ఎన్నో కథలు—సామాజికుల కళ్లు తెరిపించే, సమాజంలోని కుళ్లు చూపించే—కథలు చెప్పాడు. కథ చెప్పడానికి కవిత్వమా అని సందేహించి, ఒకప్పుడు వాదించి, సిద్ధాంతీకరించిన సోమసుందర్ కవిత్వంలో కథన, వర్ణన, నాటకీయ ధోరణులు మూడు తప్పవని చెప్పకుండా చెబుతూ కొత్త కావ్యదృక్పథానికి ముందుకురికాడు.

ఈ పరిచయంలో సోమసుందర్ గతవైభవం గురించి నేనొక్క ముక్క కూడా చెప్పనక్కర్లేదు. అప్పట్లో 'మా వూరు మారింది' కావ్యం మలుపు (turning point) గా భావించాం అస్మదాదులం. కానీ నిజమైన మలుపు 'ఆగతానికి శుభారంభం' (1982) నుంచీ అని నిర్ధారణ కొచ్చాం. 'దారిలో పడుకుంది త్రాచుపాము' కవిత రాసిన కవి సామాన్యంగా లేడు. ఎదిరిస్తే పుస్తకం జప్తు చేసి, జైలులో తోసే పెత్తనం సాగుతున్నప్పుడు ఎదిరించి ఆహుతికావడం అవివేకం నలుగురికీ నచ్చజెప్పి సంకెళ్లు తెంచుకోండి, అనే సందేశమివ్వాల్సిన కవి నలుగురి మధ్యే ఉండాలికానీ చెరసాలలో కాదు. శత్రువు చేతిలో బూడిద కాకూడదు. శత్రువునే బూడిద చేయించాలి. ఇందుకు నలుగురినీ కవ్వించాలి. శత్రువు పేరు బైటపెట్టనక్కరలేదు. 'నా గురించి కాదులే వీడు రాస్తున్నది' అని శత్రువు నిర్లిప్తంగా ఉండాలి. అప్పుడే ప్రజాస్వామ్యంలో కవి దీర్ఘాయుష్మంతుడవుతాడు. తాను పోయేకా ఇంక దేనితో తనకు పని

కవి 'కర్తవ్యం' గురించి సరి అయిన నిర్ణయం తీసుకోవడం కష్టమైన పని. కాలాన్ని బట్టి దేశాన్ని బట్టి కొత్త నిర్ణయాలు తీసుకోవాలి గానీ కాడ్వెల్, లోర్కాల్లా నేనూ చేస్తానంటే చరిత్రనుంచి మనమేం నేర్చుకోలేదని అర్థం.

సోమసుందర్ తన కర్తవ్యాన్ని తాను నిర్ణయించుకునే; ఎస్కేపిస్టు కాకుండానే రాస్తున్నాడు.

"పాము ఎంత బలమైనదైనా
పట్టుకున్నవాడి చేతికి విసురూ
చూపుకి గురీ ఉండాలే గానీ
కర్రకన్నా బలమైంది కాదు
కాని ఒక్క విషయం మరువకూడదు
తోకమీద కొడితే
తప్పకుండా పగబడుతుంది"

ఇది Allegorical image అని బుద్ధిఉన్న ప్రతివాడికీ తెలుస్తుంది.

"జిల్లేళ్ల సవాలక్ష నిండడం కన్నా
మల్లెమొక్క మనికి ఒక్కటైనా మిన్న
నరికి పారేయండిరా బాబూ
పెరడంతా తెగబలిసి పోయాయి జిల్లేళ్ల"

అనడంలో ఎంత సులువుగా బలంగా చెప్పాడో అర్థమవకపోదు. ఇలాంటి వెన్నో ఉదాహరించవచ్చు. కావ్యమంతా చదవవలసిన వాళ్లకు ముద్దలు చూపించడమేం ఖర్మ?

సోమసుందర్ కవితల్ని మూడు gradesగా ఎంపిక చేయాల్సి ఉంటుంది 1) గొప్ప కవితలు (great poems అనే అర్థంలో) 2) మంచికవితలు (good poems) 3) సామాన్య కవితలు (normal poems). అనునిత్యం ఆఖరికి కలల్లో కూడా కవిత్వమే పలుకుతారు మహాకవులు. వాళ్ల రాసినవన్నీ మాత్రం మహాకావ్యాలు కాజాలవు. ఆ సంగతి వాళ్లకీ తెలుసు కానీ సృష్టిని డస్టుబిన్నులో పారేసే కవులు తక్కువగా ఉంటారు. పైగా తన కవితకు తానే ఎవాల్యూయేటర్ కావడం కవికి ఇబ్బంది. విమర్శకులు చేస్తారా పని.

కొవ్వొత్తి కన్నీరు గొప్పకవిత అయితే పొగమంచులో జీవచిత్రాలు మంచికవిత అంటాన్నేను. ప్రేతాత్మలు ఖండికను సామ్యవాద కవితల్లో సగర్వంగా చెప్పుకోవాలి. ఇది great poem కానీ 'పద్యపాన నిషేధం' అన్నది good poem. గొప్పపద చిత్రాలున్నంత మాత్రాన great poem కాదు. ఇలా gradation చేసుకుంటూ పోతూ ఈ మూడురకాల కవితలకు లక్షణాలు చెప్పడం ఇప్పుడు కుదరదు. ఆ పని మరెప్పుడైనా శాస్త్రీయంగా చేద్దాం

సోమసుందర్ సంస్కారమంతా సామ్యవాదంకోసం ఆశపడటం, ధన స్వామ్యంమీద నిరాశపడటం అనే వాటికి సంబంధించిందే ఆశనిరాశలను మనం కవితల్లో అన్వయించుకోవడం బాలా అవసరం, నినాదప్రాయంగా కవితలు రాయడం పట్లకొన్ని మినహాయింపులు, షరతులు పెట్టుకుని, వ్యంగ్యంగా (suggestive) కవితలు రాయడానికి ఎప్పుడూ మొగ్గుచూపడం వల్లనే ఈ క్లేశమంతా.

ఎదిగిన పాఠకులకూ, పరిణతి పొందిన కవి విమర్శకులకూ సోమసుందర్ కావ్యాలు క్లేశం కలిగించవు. ఎటొచ్చీ మస్తిష్కానికి కొంత పని

చెబుతాయి. శ్రీశ్రీ సులువుగా చెప్పడం అంత కష్టం లేదన్నాడు. ఆ కష్టం లేకుండా చెప్పడానికి ఎంతో శ్రమపడాలి. అలాగే కవి ఇంత సులువుగా చెప్పాడా అనుకోవడానికి కూడా కొంత శ్రమతప్పదు. ఆధునిక కవిత్వం అనేక అంశాల సమాహారం కావడం వల్ల అనేక మార్గాల కూడలి కావడం వల్ల నిజమైన ఆధునిక కవిని గుర్తించడం ఆలస్యమవుతుంది. సోమసుందర్ విషయంలో ఇదే జరుగుతోంది.

రెండోది సోసు కవిగా 1949 నాటికే చరిత్రకెక్కాడు. ఆ నాటినుంచీ ఈ 4 దశాబ్దాల సాహిత్య చరిత్రలో చర్చనీయంగానే ఉంది అతని విషయం. అతని సమకాలంలో కవితలు రాసిన వారెవరూ (ఒకరిద్దరు తప్ప) ఇప్పుడు రంగంలో లేరు. కనుక సోసు సీనియర్ ఆధునిక కవి అయ్యాడు. కొన్ని వివాదాలలో పాత్రవహించి, కొందరికి దూరమైనా, అవన్నీ తాత్కాలికాలు. కవి ప్రతిభను గుర్తించడానికి 'రాజకీయాలు' అడ్డు రాకూడదు. సోమసుందర్ కవితను పునఃపరిశీలించడానికిది సరి అయిన సమయం.

'ఒక్క కొండలో వేయిశిల్పాలు' అనే సంపుటి 1984లో వచ్చింది. ఇందులో 'నా లేఖిని శిలీముఖి' 'మనస్స్నానం' 'వాజీకరం' 'హిరణ్యహరిణం' వంటి great poems ఉన్నాయి. "ఆగామి శతాబ్ది ఆహ్వానిస్తోంది" అన్నది one of the longest poems. ఆధునిక చైతన్యం ఇంతగా ముద్రితమైన కవిత తెలుగులో మరొకటి ఇంతవరకూ రాలేదు.

'సోమసుందర్ బృహత్కావ్యాలు' గురించి ఏ తెలుగు పత్రికలోనూ సమీక్ష వచ్చినట్లు నేను చూడలేదు. మనకు సమీక్షకులు ఎవరైనా ఉంటే వాళ్లేంచేస్తున్నారో నాకర్థం కాలేదు. లేకపోతే, కవిగారే దీన్ని సమీక్షలకు పంపలేదా అని సందేహం. తెలుగులో ఈ దశాబ్దిలో వచ్చిన ఒక గొప్ప కావ్యం చెప్పమంటే నేను బృహత్కావ్యాలనే పేర్కొంటాను. చాలామంది నాతో ఏకీభవించక పోవచ్చు. అలాంటివారు వాటిలోని గుణావగుణాలను అధ్యయనం చేసి చెప్పేదాకా వారి మాటలకు విలువివ్వలేను.

ఈ కావ్యంలో కవి కన్యాకుమారి వద్దతన సమాధిని నిర్మించుకోవాలని ఉన్నట్లు ప్రకటిస్తాడొక చోట. ఇదొక దేశాటన జీవన కావ్యం. ఈ కావ్యంలో 'కాలంవీలునామా' ఒక ఆత్మచరిత్రాత్మక విలక్షణ సుదీర్ఘ కావ్యం. సమకాలిక వ్యవస్థ దీని ఏకసూత్రం. మహాసముద్రంలా లోతూ హిమవత్పర్వతంలా ఎత్తూ ఉంటే ఏ వస్తువైనా గొప్పది అంటాం. అలాంటి గొప్పదనం ఈ కావ్యంలో ఏదో ఉంది. సమకాలిక ధనస్వామ్యాన్ని ఇంతగా ద్వేషంతో

చెరిగివేయడం మరో ఏ సమకాలిక కావ్యంలోనూ నేను చూడలేదు కావ్య శిల్పం దృష్ట్యా కూడా ఇది గొప్పకావ్యం. సామ్యవాదావతరణాన్ని సూర్యోదయంతో పోల్చి చేసిన వర్ణన రమ్యమయింది.

అసలు మనకు ఆధునిక కవిత్వం అచ్చువేయడానికేనా ఎందుకైనా పని కొస్తోందా జిహ్వకు? అనే ప్రశ్నవస్తుంది. ఉత్తరాది కవిసమ్మేళనాల్లో కవులు తమ కవితలను అరగంటకు తక్కువ కాకుండా చదివి కరతాళధ్వనులందు కుంటారు. మన 'మినీకవితలు' ఇందుకు వెన్ను పోటు పొడుస్తాయి. ఈ 'కాలం వీలునామా'లో కొన్ని ఘట్టాలు 'రెసిటేషన్'కు తగినంత ఉజ్వలంగా ఉన్నాయి. ఇందులో భగత్‌సింగు కథ, బ్రహ్మరాక్షసి కథ, సముద్రం కథ. శ్మశానం కథవంటివి గుండెలను పట్టుకుని వదలవు. కాలం వీలునామా ఒక విధంగాకథల సర్వస్వం.

ముక్తచ్ఛాయ కవుల కావ్యంలా కనిపిస్తుంది. బూర్జువా పెటీబూర్జువా వర్గాల క్రీనీడల నుంచి విడివడితే సమకాలిక సాంఘిక జీవితం సౌందర్యంతో నిండిన ప్రపంచంలోకి ప్రవేశిస్తుందని సోసు భావిస్తారు. సింబాలిజంలో కవి ఎంత ఆరితేరారో తెలియాలంటే ముక్తచ్ఛాయ చదవాలి.

ఇరవైఅయిదు జీవిత చిత్రాల సంపుటీకరణం 'అరిచేలోయలు' కావ్యం. ఆధునిక జీవితమే ఈ కావ్యానికి ప్రాతిపదిక విమర్శ, అధిక్షేపం ఆధునిక కావ్య మర్యాదలుగా భావించిన సోమసుందర్ ఈ కావ్యంలో హాస్యానికి అభిషేకం చేశారు. "మన జాతీయ చిహ్నం పులిస్తరాకే ఎంగిలాకులూ గుండ్రంగానే ఉన్నాయి. నిరాశలూ శూన్యాలూ అన్నీ సున్నాలే. అదే మన జాతీయ సంకేతం" అనగలిగిన సోమసుందర్ సాహసి. ఎవరో ఏదో నిందిస్తారని, అవహేళన చేస్తారని సోమసుందర్ భయపడటం లేదు. ఆత్మను కక్కుర్తిగా అమ్ముకోవడం ఆధునికతాభాస అవుతుంది. తాను నమ్మిన—కాదు —తనకు నిజమనిపించిన నిజాన్ని నిర్భయంగా చెప్పడం-భావ స్వాతంత్ర్యం ప్రకటించడం ఆధునికత మహా లక్షణం. దీని ప్రేరణే తిరుగుబాటు "యుగ ధర్మం చైతన్యం జనహృదయం పోరాటం తిరుగుబాటు తిరుగుబాటు తిరుగు బాటు బావులూ" అంటూ మహాసంకల్పం చెప్పుకున్న సోమసుందర్ సామాజిక సాహిత్యక విమర్శకుడుగానూ తిరుగుబాటు దారుడుగానూ నిలబడుతూనే సాగుతున్నారు.

"గెడ్డాలున్నవాళ్లంతా ఋషీశ్వరులు కారు! అడవుల్లో మసిలే వాళ్లంతా గెరిల్లాలు కారు.... ఈ దుర్భర దుస్సహ ధనస్వామ్య వ్యవస్థను పరిమార్చేం

దుకు అకటావికటపు ఆటవికత్వం గమ్యమెన్నడూ కానేరదు" అని ప్రకటించడం తిరుగుబాటు మీదే మరో తిరుగుబాటు. నిజానిజాలను వడబోసుకోకపోతే ఆధునికీకరణం వ్యర్థమయిపోతుంది.

ఇక తాజాకావ్యం 'ఆంగ్లసీమలో ఆమని వీణలు'. దీన్ని ఇంగ్లాండులో కూచుని కూడా తెలుగులోనే రాయడం విచిత్రం. ఇది ఎంత విశిష్టమైన కావ్యమో తెలిసేది వెంటనే ఆంగ్లంలోకి కూడా తర్జుమా అయి ఉంటే. అయినా తెలుగువాళ్లు దీన్ని అంతర్జాతీయంగా తము పొందిన గౌరవంగా భావించవచ్చు. ఈ కావ్యం ఆత్మాశ్రయంగా సాగినా కేవలం ఆత్మకథ కాదు; కాల్పనికం కాదు. ఆయా స్థలాలూ వ్యక్తులూ అనుభవాలూ మనకొక నూతన కావ్య ప్రపంచాన్ని చూపిస్తాయి. భావకవిత్వం కన్నా భిన్నమై భావకవితా లక్షణాల ఆధునికీకరణంతో అలరారుతున్న ఈ కావ్యం అలనాడు శ్రీనాథుడు భీమఖండంలో వ్యాసుడికి ఆంధ్రదేశాన్ని చూపిస్తున్న అగస్త్యుడిలా మనకు ఆంగ్లసీమల్ని చూపిస్తుంది

దేశాటనం కవుల నందరినీ గొప్పకవులుగా చేయజాలదు. అనుభవాలను సేకరించి, వాటికి రమ్యాక్షర రూపం ఇవ్వగలిగిన వారినే మహాకవులుగా మారుస్తుంది దేశాటనం ఆంగ్లసీమలను చూడటంలో మైమరచిపోయి రాసిన కావ్యం కాదిది. తెలుగు దేశానికీ బ్రిటిషు దేశానికీ వారధి కట్టగల సాంస్కృతిక విశేషాలనెన్నింటినో కీర్తిస్తూ కూడా సామ్యవాద చైతన్యం విస్మరించకుండా రాసిన కవిత ఇది.

"అస్తమానూ ఆరిపోయే విద్యుద్దీపాలకు తోడుగా మన దేశపు చీకటి కత్తివేస్తే దిగనంత గట్టిది" అనగలిగిన కవి ఏ దేశం వెళ్లినా, అక్కడి వైభవాలకు పరవశుడయిపోలేదు.

"నీకు తెలుసు మనదేశం మంచి మనుషులకోసం మంచి కవిత్వంకోసం మంచినీళ్లకోసం ఎంత వేగిపోతోందో? నాకు తెలుసునన్నా మంచిలనాన్ని ప్రేమించిన నీ హృదయం ఎంత దురపిల్లుతోందో ఈ అపసవ్య పరిస్థితికి?" అంటూ అక్కడ కూడా మన కవి బాలగంగాధరతిలక్‌ను పలకరిస్తూ రాసిన సోమసుందర్‌ను 'ఇడుగో ఇతడు మేమంతా గర్వించదగిన గొప్పకవి' అని పాశ్చాత్య దేశాలవారికీ ప్రాచ్య దేశాలవారికీ చెప్ప గలిగినప్పుడు మనం న్యాయం చేసినట్లవుతుంది.

కవి, విమర్శకుడు, కథకుడు, అనువాదకుడు, సంపాదకుడు, వక్త

శ్రీ ఆవంత్స సోమసుందర్
సారస్వత జీవితసార సంగ్రహం

జననం—18 నవంబరు 1924      నివాసం—పిఠాపురం
విద్యాభ్యాసం-పిఠాపురం, కాకినాడ; భాషలు–సంస్కృతం, తెలుగు, ఇంగ్లీషు

1. కవితా సంపుటాలు – వజ్రాయుధం (1949) నాల్గు ముద్రణలు, కాహళి (1952), గోదావరి జల ప్రళయం (1953), రక్తాక్షి (1958) రెండు ముద్రణలు, సోమరసం సుందరకాండ (1963), మేఘరంజని (1963), మిణుగురులు (1963), అనలకిరీటం (1977), వెన్నెలలో కోనసీమ (1978), రాలిన ముత్యాలు (1979), మా ఊరు మారింది (1979), ఆగతానికి శుభారంభం (1982), సోమసుందర్ బృహత్కావ్యాలు (1983), ఒక్క కొండలో వేయిశిల్పాలు (1984), ఆంగ్ల సీమలో ఆమని వీణలు (1985)

2. సాహిత్య విమర్శ—శేషేంద్రజాలం (1975), కృష్ణశాస్త్రి కవితాత్మ (1981) రెండు ముద్రణలు, రుధిరజ్యోతిర్దర్శనం (1981), పురిపండా ఎత్తిన పులిపంజా (1983), సాహిత్యంలో సంశయ కల్లోలం (1984), కవిత్వం కాలాతీత కాంతిరేఖ (1984), అమృత వర్షిణి (1984), కృష్ణశాస్త్రి వెలిగించిన కార్తిక దీపాలు (1985), లియొనార్డోడావించి కళాజీవనగాథ (1986)

3. కథలు—బానిసల దేశం (1950), సోమసుందర్ కథలు (మూడు భాగాలు 1984).

4. అనువాదాలు— మందీ మనిషీ (1953) ఎర్నెస్ట్‌టాలర్‌కు అనువాదం, బుద్ధదేవ బోసు (1982) అలోక్ రంజన్‌దాసు గుప్తాకు అనువాదం

5. సంపాదకత్వం— దండోరా మాసపత్రిక (1951-52), కళాకేళి సాహిత్య మాసపత్రిక (1968-70), గానకళా సంగీత మాసపత్రిక గౌరవ సంపాదకత్వం, వాహిని-యు కె తెలుగు క్లబ్‌వారి సావెనీర్

6. సాహితీ యాత్రలు— అఖిల భారత విద్యార్థి కాన్ఫరెన్సుకు కలకత్తా (1943), ఆసియా ఆఫ్రో రచయితల మహా సభలకు ఢిల్లీ (1957), ఇంగ్లాండు-తెలుగు క్లబ్ వారి పిలుపు మీద (1983), కర్నాటక, మహారాష్ట్ర, కేరళ, తమిళనాడు, బెంగాలు, మధ్యప్రదేశ్ యాత్రలు అనేకం.

7. నవలలు— కొత్తపంట (1954), గోదావరికి రెండుగట్లు, దేవుడి తోట, సంచారిణీ దీప శిఖా

8. నాటికలు— రాబందుల రాజ్యం, విషవలయం

9. గేయనాటికలు— మదనోత్సవం, పద్మవ్యూహం, మత్స్య యంత్రం, సత్రయాగం

10. పరిశోధన— దేశిసారస్వతం, ప్రఖ్యాత సంగీత వేత్తలు,

11. సమీక్షలు— భారతి, ఆంధ్రపత్రిక, ఆంధ్రజ్యోతి, విశాలాంధ్ర, కళాకేళి మొదలైన అనేక పత్రికలు.

12. పీఠికలు— ఇస్మాయిల్, కొత్తపల్లి సత్యశ్రీమన్నారాయణ, దిలావర్, ప్రత్యూష, జానకీజానీ, మేకా సుధాకరరావు, రాంషా, పూభా, ఈరంకి వెంకట్రావు, రాఘవ, బదరీనారాయణ, నాగభైరవ కోటేశ్వరరావు, విరియాల లక్ష్మీపతి, మిరియాల రామకృష్ణగార్ల కావ్య సంపుటాలకూ ఇతర పుస్తకాలకూ.

13. ఉద్యమాలు— తూగోజిల్లా యువజన సమాఖ్య ఉపాధ్యక్షుడు (1946-51), అభ్యుదయ రచయితల కార్యవర్గ సభ్యుడు (1947-57), అఖిల భారత అభ్యుదయ రచయితల సంఘం జెనరల్ కౌన్సిలు

(1952), కాకినాడ సాహిత్యలహరి అధ్యక్షుడు (66–67), ఆంధ్ర అభ్యుదయ రచయితల సంఘం సహాయ కార్యదర్శి (1972), శ్రీశ్రీ సప్తతి పూర్తి మహోత్సవ సంఘం ఉపాధ్యక్షులు (1983), కళాకేళి నికేతన్ నిర్వాహకుడు 1944 నుంచి. కళాకేళి పబ్లికేషన్స్ 1948 నుంచీ.

14. సన్మానాలు— అలమూరు 1954, విజయనగరం 1955, ఆంధ్ర సారస్వత పరిషత్తు 1958, పటాన్‌చెరు 1958, ఏలూరు 1965, ప్రపంచ తెలుగు మహాసభలు 1975, ఆంధ్రప్రభ సంస్థ సన్మానం 1980, విశాలాంధ్ర త్రిదశోత్సవ సన్మానం 1982, షష్టిపూర్తి సన్మానం 1984, ఆంధ్ర దేశంలోని అన్ని ముఖ్య పట్టణాలలోనూ లెక్క లేనన్ని సన్మానాలు.

15. అవార్డులు— సోవియట్ లాండ్ నెహ్రూ అవార్డు 1978, రాజా లక్ష్మి ఫౌండేషన్ అవార్డు 1980

16. ఫీచర్లు— జ్వాలలూ మాలలూ, ఎర్రదీపాలు, కెరటాలు-కిరణాలు, గవాక్షంలో అంతరిక్షం, సాహిత్యంలో సంశయ కల్లోలం

17. అచ్చులో ఉన్న పుస్తకాలు— అగ్నివీణ ఆలాపించిన అణుసంగీతం, జాతికి జ్ఞానజ్యోతి, సోవియత్ కవితలు, జార్జి తాంసన్ గ్రంథాలు, గోర్కీ రచనలు (అముద్రితాలనేకం)

18. చిరునామా— ఆవంత్స సోమసుందర్, కళాకేళి, పిఠాపురం.

కూర్పు : 'మీరా'

## వజ్రాయుధపాణి

అన్నా!
నీ కవిత చిన్నప్పుడు విన్నా
నేటికీ నన్ను వెన్నాడుతోంది దాని పరిమళం సన్నగా
సింహాచలం సంపెంగ కన్న మిన్నగా,
కవితల హరివిల్లులు
విమర్శల విద్యుల్లతలు
ఉపన్యాసాల చల్లని గోదావరి గాలులు
అభ్యుదయ భావాల మందార మాలలు
కవీంద్రా! నీ వజ్రాయుధానికి వేయి అంచులు
నిప్పురవ్వలు మూట కట్టిన సంచులు
మంచి ఎక్కడ ఉన్నా గ్రహించే అంచనేర్పు
ఒక్క కొండలో వేయి శిల్పాల తూర్పు!
నీకు శబ్దశక్తి తెలియదన్నా డొక జడుడు
కవిగా నువ్వు విగత జీవివన్నా డింకో శఠుడు
ఆ దురుసు పలుకులకేంగాని
ఇదిగో! నా మాటవిను :
ఆధునిక కవులలో నువ్వు 'భవభూతి' వనడం సరి
ముందు ముందు రాకపోదులే మరి
నిన్ను 'కాళిదాసుతో' కలిపి కొలిచే సూరి!!

(తంగిరాల అముద్రిత కావ్యం 'కవిసేన'నుండి)

## సోమసుందర్

### కాలాంగనా కరగ్రహణం

నాకింకా జ్ఞాపకం వుంది :
కాలదేవత కరాంగుళుల శీతల సర్పర్శతో
నా వెన్ను బాముపై పలికించిన
నిశ్వాస తరంగ సంగీతం....
నిశాంధవేళా విభృత తోరణం

నాకింకా జ్ఞాపకం వుంది
నన్ను విడిచి దూరంగా జరుగుతూ
వెక్కిరిస్తున్న గతాల కంకాళాల వికటాట్టహాసం,
దగ్గరగా రమ్మని బిగ్గరగా పిలుస్తున్న
ఆగామి మరీచికల ఆహ్వాన గీతం....

నాకింకా జ్ఞాపకం వుంది
అజ్ఞానాంధ తమస్వినులలో
అజ్ఞాత అఖాతాల విపత్ స్వరాలు
తంద్రాలస మనస్సుతో నడుస్తూ
కాంతి వత్సరాల కాలవేగంతో
సాగుతున్నట్లు భ్రమిస్తూన్న సమయంలో
జీమూతం వంటి భయంకర జంతువేదో
నన్ను రాసుకుంటూ వేగంగా పోయినపుడు
నా లోపలి శూన్యంలో వెలిగిన మిరుమిట్లతో
కఠిన శిలలవంటి గతాలకు
అధఃకరించానన్న తృప్తితో ఊగిపోయాను;
ఆవేశ వర్షంలో తడుస్తూ
ఆమని వేకువలకై ఆక్రోశించాను.

నాకింకా జ్ఞాపకం వుంది;
యౌవనామృతం ఇంకి పోకుండా
భద్రపరిచానని భ్రమించాను;
సుకుమార బాల్యాన్ని నిరంతరాయంగా
పునస్సృజిస్తూ పురోగమిస్తున్నా ననుకున్నాను;
కాలాన్ని కరగ్రహణంతో
స్వాధీనం చేసుకోగలిగానని గర్వించాను....

నాకింకా జ్ఞాపకం వుంది
ఆ నాటి వేకువలో వేవెలుగులు
వేయి ముక్కలై రాలడం;
ఖాండవ దహన సమయంలో
ఒంటరిగా యోజనాలు ప్రయాణించడం;
గతాలు కంటకాలుగా నా అరికాళ్ళను కరవడం,
కొండ కొమ్ముల కెగబ్రాకే సమయంలో
పగిలిన నా మోకాళ్ళను
గమనించకుండా కుంటడం,
నింగి కొసలకెక్కి నెలవంక శృంగాలకు
ఊయెల చేరుల్ని పన్నడం-
హై! ఆ బంగరు కాలమంతా నాకింకా జ్ఞాపకం వుంది!

లక్షమైళ్ళ నా అపజయాలనుంచి
నాకూ నా అంతశ్ఛాయకీ నడుమ కపాలాలు
ప్రోగులు పడ్డ కృతకాద్రుల విస్మరించి,
సూర్యకిరణాల ఉలులతో,
నా గుండెపై కర్తవ్యగీతాలు చెక్కిన
వర్తమాన ఉల్కాపాతాలను తిరస్కరించి,
విభావరీ తమస్వినుల చేలాంచలాలలో
నా కళ్ళకు గంతలు కట్టిన
గాంధారీ పాతివ్రత్య సదాచార భారాల తృణీకరించి,
ఆకస్మికంగా మేలుకొని, నన్ను నేనే విడచి
పారిపోవడం - నాకింకా జ్ఞాపకం వుంది !

# సంజీవదేవ్

## హృదయగీతి

మట్టిమీద
పుట్టినట్టి
మల్లెలు మందారాలు
గుట్టలు చట్టులు రాళ్లు
మార్దవానికి
కాఠిన్యానికి
మారు మారు పేర్లు:
మట్టి మెత్తనిది
మల్లె మెత్తనిది
మెత్తనిది కూడ
మందార సుమం;
గుట్టలు కఠోరం
చట్టులు కఠోరం
కఠోరం కూడ
రకరకాల రాళ్లు
హృదయం కోమలం
మల్లెకన్న
మందారంకన్న
హృదయం కఠోరం
గుట్టకన్న చట్టుకన్న:
హృదయానికున్నవి
మల్లెల సౌరభం
మందారపు రంగు;
మట్టిలోన పుట్టినవి
మల్లెలు మందారాలు
మనిషిలోన పుట్టినవి

మానస స్పందనలు;
ప్రీతికి భీతికి
రీతికి నీతికి
లోతుగల గూడు
హృదయ కుహరం
పిట్టగూడు కాదది
ఎవరూ కట్టని గూడు
గుండెలోని గూడది
బండలను కరగించే
మండుటెండలను
చల్లార్చే
చల్లని వెచ్చని
రసమయ స్పందన.
ఆ స్పందన
సృజిస్తుంది
అమూర్త రూపాలను
వెలిగిస్తుంది
వెలగని దీపాలను;
దీపపు అభావంలో
కనిపించదు రూపం
ఉండదు కూడ
రూపంలేని దీపం
హృదయమొక రూపం
దాని స్పందనొక దీపం.

** ** **

"సముద్రం ఒక కెరటాల సంకలనం కాదు
సముద్రమొక మార్మిక ద్రవ్యం
సముద్రమొక భాష
ఒక్కో తరంగం ఒక్కో ప్రతీక
ఒక్కో అలంకారం ఒక్కో నౌక" —శేషేంద్ర

# వాడ్రేవు చినవీరభద్రుడు

## హైదరాబాద్ : రెండు పద్యాలు

### 1

తొలి సంజ కాంతిలో నగర పుష్పం విప్పారింది.
మోటారు వాహనాలు జుమ్మని ముసురుకున్నాయి.
పౌడరు పూత దేహాల ఉద్వేగం, టైర్లు,డీసెల్
తాజా వార్తా పత్రికలు, పొగ, సబ్బు వాసన–
దైనందిన నగర జీవిత పరిమళం నన్నల్లుకుంది,
ఈ శతపత్ర వక్రరేఖల వలయాల్లో దినమల్లా తిరిగిన దారుల్లో తిరుగుతాను.
సెకండ్‌హాండ్ పుస్తకాలు, అభిప్రాయాలు
వేళ తప్పని నమాజులు, కిళ్ళీలు, ఉమ్ములు
చర్విత చరణాలైన నీతులు, నల్లని బురఖాలు
పాలు చిమ్మే ఆపిల్ పండ్లు రహస్య ద్వేషాల మొగలాయి దర్బారులు.
ఎంత తిరిగినా
ఎన్నిసార్లు వచ్చి వెళ్ళినా
ఈ నగరం తన రహస్యాన్ని నాకు చెప్పనే చెప్పదు.
మళ్ళీ సంజ వేళకి నగరం ముడుచుకుంటుంది.
అలిసిన గుమాస్తాల్ని,
ఇళ్ళకు మోసుకుపోతున్న సిటీ బస్సుల వెనగ్గా
నలిగిన రోడ్లమీంచి విద్యుద్దీపాల వింతనగరం పుట్టుకొస్తుంది.
మానవ సంబారపు అమాయికమైన అట్టహాసంకింద
ఏ రహస్య విషాదం దాగివుందో
దూరంగా గోల్కొండ గొణుక్కుంటుంది.
అర్థరహితమైన అబిడ్సు రోడ్డు సంరంభం
అస్పష్టమయిన దిగులుని రేపుతుంది.
కాంక్రీటు రాక్షసాకృతుల నీడలనుంచి
బెదురుగా నంగిరిగా సందులోకి జొరబడుతుంటే
ఎవరి జెడలో జాజి వెండో నా బుజానికి రాసుకుంటుంది.

అట్లాంటి ఒక్కక్షణం మైమరపులోనే
బహుశా ఒక నగరం వైభవమంతా ఉందనుకుంటాను.

2

భ్రాంతి లేని జీవితాన్నే కోరుకున్నాం మనం.
జీవించడం ఎలానూ తప్పదు;
యీ కప్‌లో ఒక స్పూన్ నమ్మకాన్ని కూడా కలపమన్నాం.
కాలువగట్టు నీడన సోమరి కునుకు తీసిన మధ్యాహ్నాల్లో
"ఏది నిజంగా ఏమిటి?"
అన్న ధ్యాసే లేదు మనకి
వ్యాపకాల్ని వెతుక్కుంటో రోజులకి రోజులు
ప్రయాణాల్లో కూరుకు పోయినపుడు
ఒకటి రెండు సందేహాలు కలిగినా
ప్లాట్ ఫాంల పైని పోర్టర్ల సందడి కమ్మేసింది మనని.
ఇప్పుడిక ఈ వేగాల, ఆరాటాల అల్లిక జిగిబిగిలో
కాళ్ళూ చేతులూ కూరుకుపోయి
ఆక్రందించట మొకటే మిగిలింది మనకి.
అన్నీ ఉన్నాయి ఇక్కడ
అనుభవించడానికి తీరిక తప్ప.
ఇంక జీవితానికి అర్థం వెతక్కు.
అభిలషించిన దానికీ అందిన దానికీ మధ్య
ఆ అందమైన తెరనట్లా ఉండనివ్వు.
మనోహరమూర్తి రెబెకాని
ముసుగు తొలగించి చూడాలనే ఆ శిల్పి తపించాడు.
కాని అతనూ మానవుడే కద.
మన విషాదమంతా తొలగించలేని ఆ చివరి తెర.
భ్రాంతిలేని జీవితం ఎంత సుందరమో తెలీదుగానీ
ఈ భ్రాంతి బంధురమైనదే అత్యంత సుందరం మనకి.

## తంగిరాల సుబ్బారావు

### గురువుగారి కలకల నవ్వు*

1

అందమైన బెంగళూరు బస్సు అద్దాల కిటికీలోంచి
అనుభూతుల రంగుల జ్ఞాపకాలు చల్లుకుంటూ వస్తున్నాను ...
చిత్తూరు జిల్లా లోయల్లో పచ్చని వరి పొలాలు
పైరగాలికి తలలూపడం చూస్తున్నాను....
మండే వేసవి ఎండల్ని మదనపల్లి హార్స్లీ హిల్స్ చెరపట్టాయి....
చంద్రగిరి దుర్గంలో కాలం చరిత్రా కలిసి ఘనీభవించాయి....
తిరుపతి కొండ స్థిరంగా నుంచుంది
దీపాల తిరునామంతో దీవించింది
'మహాసముద్రం' చెరకు తోటల్లో
రామచిలుకలదండు కిలకిలారావం చేసింది
గురువుగారి కలకల నవ్వు నా గుండె క్రింద
మంచి గంధం పూసింది....

2

ఈ క్యాంపస్లో ఒకప్పుడు
సిమెంటు చత్రాలలో నక్కిన చిన్నిమొక్కలు
ఇప్పుడు మహావృక్షాలుగా ఎదిగి
గాలిలోకి చేతులు చాచి
నిత్య యౌవనులైన విద్యార్థుల మీద
నీడల గుబ్బగొడుగులు పడుతున్నాయి....
యూనివర్సిటీ శంఖుస్థాపనలో పూజింపబడిన ఇటుక
దేవేంద్ర భవనంగా పైకి లేచి
మేఘాల కాశ్మీరు శాలువా కప్పుకుంటోంది....
లేత తమలపాకులాంటి ఒక రైతు బిడ్డ

---

* 8-8-1988 నాడు తిరుపతిలో జరిగిన గురువర్యులు ఆచార్య జి. యస్. రెడ్డిగారి షష్టిపూర్తి సభలో చదివిన కవిత.

"ఇంతితై వటుడింతయై...." పెరిగి
భాషా సాహిత్య సౌహిత్యాల త్రివిక్రముడై
విశ్వవిద్యాలయ బ్రహ్మాండాన్ని ఆక్రమించి
అందరికీ అభయ హస్తమిచ్చాడు
ఏ బలిచక్రవర్తి మీదా మూడోపాదం మాత్రం మోప లేదు!
ఉపాధ్యాయ వృత్తి రూపకంలో
తన పాత్ర తాను నిర్వహించి స్టేజిమీంచి తప్పుకుంటున్నాడు....
షష్టిపూర్తి గ్రీన్ రూంలో వేషభూషణాలు విప్పుకుంటున్నాడు....

ఈయన మా గురువర్యుడు
నిరంతర పరిశోధనాధుర్యుడు
శిష్య వాత్సల్య సముద్రుడు
అవినీతి పాలిటి రుద్రుడు!
జీవితాన్ని పువ్వుల కిరీటంగా ధరించి
అందరికీ నవ్వులు పంచినవాడు

వంచన ఏ కోశానా లేని మంచివాడు!
నిప్పులు గుప్పిట పట్టినవాడు! నీతిని* ప్రేమించినవాడు!!

3

శేషశైల శిఖరం మీద కురిసిన పూలవాన
లేళ్లుగా చెంగలించి
సెలయేళ్లుగా పరుగులెత్తి
జలపాతాలుగా ధుమికి
నదీ నదాలుగా వరదల ఊరేగింపులు చేసి
నలు దిక్కులా గభీర సాగరాలుగా విస్తరించి
కెరటాల పడగలు విప్పి
కేరింతలు కొడుతోంది....
సారస్వత శివతాండవం చేస్తోంది....
అందులో ఆకాశం తన లావణ్యం చూస్తోంది....
బాలాజీ మెడలోని గులాబీ దండలా
గురువుగారి కర్పూరపు నవ్వు నా గుండె క్రింద గుబాళిస్తోంది....

---

* 'సునీతను' పాఠాంతరం

4

మనుషుల వస్తారు పోతారు
నదులు మాత్రం ప్రవహిస్తూనే ఉంటాయి....
నక్షత్రాలు నవ్వుతూ ఉంటాయి
పక్షులు పాడుతూ ఉంటాయి
అరణ్యాలు ఆడుతూ ఉంటాయి
సూర్యచంద్రుల దాగుడు మూతల్ని
పర్వత శిఖరాలు చూస్తూ ఉంటాయి....

తెలుగు భాషా సాహిత్యాల సుప్రభాత కిరణాలతో
ఏడు కొండల వాడి పాదాల ముందు
ఎప్పుడూ
అజ్ఞాన హిమం కరుగుతూనే ఉంటుంది
అఖండ జ్యోతి వెలుగుతూనే ఉంటుంది....

మంచి గంధం లాంటి
మలయ మారుతం లాంటి
మల్లెపూల పరిమళం లాంటి
మా గురువుగారి కలకల నవ్వు
శిష్యుల గుండెల క్రింద జలజల ప్రవహిస్తూ
మళ్లీ మళ్లీ
సుళ్లు తిరుగుతూనే ఉంటుంది....
భవతు!

* * * *

"ఎంత ఎత్తుగా ఎదుగుతాడో మనిషి ఈ కఠిన ధరిత్రి మీద
అంత దీర్ఘంగా పడుతుంది చరిత్రలో వాడి నీడ" —శేషేంద్ర

# జయప్రభ

## గుండెలో పొగమంచు

దీప స్తంభాలు
నిటారుగా నిలబడ్డ చీకటి సైనికుల్లా
ఆకాశంలోకి చొచ్చుకు పోతుంటాయి

విరిగిన విగ్రహాల మధ్య
శిథిల గోపురాల మధ్య
పలచగా పరుచుకున్న వెన్నెలతో
పాము చర్మంలా మెరుస్తూన్న
నాచుపట్టిన నాపరాళ్ళ మధ్య
గర్భగుడిలోంచి గాలిలోకి వ్యాపించే
పంచామృతాల....పచ్చకర్పూరాల
వాసనల మధ్య ...
దిగులుగా ఉన్న చంద్రుడిని చూస్తూ
దిగులుగా ఉన్న మనం!

సముద్ర పొడ్డున కెరటాల వెంట తీసిన పరుగులు
చిన్నతనాన్ని తిరిగి రప్పించుకుని
ఇసుకలో ఆడిన ఆటలు
రొప్పుతూ ఎక్కలేక ఎక్కిన గుట్టలు
అలిసి కూలబడి
కలిసి తాగిన కొబ్బరి నీళ్ళూ
ఇప్పటికీ గుర్తొస్తూంటాయి

విడి పోయే ముందు
నా నుదిటి మీద నువ్వు పెట్టిన ముద్దులా
కన్నీటి తెరల మధ్య మన నవ్వులా
రైలు కూతతో విడదీయక తప్పని చేతివేళ్ళ మధ్య

విక్కు పడ్డ జ్ఞాపకాల్లా
నువ్వెప్పుడూ నాతో ఉంటావు

తలతిప్పి ఒక్క సారైనా
వెనక్కి తిరిగి చూడాలనుకుంటాను
నా బంధనాల్లోంచి తల బయట పెట్టే సరికి
నెలలు సంవత్సరాలై పోతాయి!

ధ్వజస్తంభపు చిరుగంటలూ
నీ చిరునవ్వులూ కలిసి
నా చెవుల్లో లీలగా ధ్వనిస్తాయి

నా ఇష్టాలతో ప్రమేయం లేని కాలం
తనతో లాక్కుపోతూ ఉంటుంది
నాకు పరిచయం లేని తీరాలకి!
గుండ్రంగా వెలిగే చంద్రుడిని చూసినప్పుడల్లా
కరక్కాయ నమిలిన తీపి పొగమంచులా
గుండెలో కమ్ముతుంది!

మళ్ళీ మామూలే....
కలతలు.... కలలు మోసుకుంటూ.... పరుగు!!

ఎప్పుడో ఏ రాత్రి నిద్రలోనో
విరిగిన కెరటంలా
సరుగుడు చెట్ల వెనక
సముద్రపు హోరులా
ఎత్తైన గోపురం మీంచి ఎగిరే జెండాలా

రెపరెపలాడే కోరికలు నాలో
అస్పష్టంగా మిగిలి పోతాయి!
అస్పష్టంగా....!!

# వాసు

## లెక్క తెగట్లేదు

నాయుడూ నువ్వు లెక్కలు బాగా చేసే వాడివి
మనం పుస్తకాలు ముందేసుకుని ఏవో పాటల వంటూ
లెక్కలు చేసేపుడు
నువ్వు మాట్లాడుతూ మాట్లాడుతూ
లెక్కల్ని సూత్రాలతో సాధించే వాడివి.
నేను ఆశ్చర్యంగా నీ పుస్తకంలోకి చూస్తూ
ఇదెలా వచ్చిందేం అంటూ నిన్ను పక్కకి లాగే వాడ్ని.
అపుడు నువ్వేం చేసే వాడివో!
నీ వెనక నడుస్తూ నేనేం వినేవాడ్నో!
ఒక సముద్రశాఖ దూసుకొచ్చి
ఒడ్డుని చీపురుకట్టలా ఊడ్చేసి
అఖండ భూభాగం చీలిపోవడం చెప్పే వాడివి.
బతుకుతెరువు తోడేలై
సరళ జీవనకాంక్షాకురంగాన్ని పట్టుకోడానికి
పూలమొక్కల వెనక పొంచున్న సంగతి చెప్పేవాడివి.
పక్కన అప్పుల శవాలు పడున్నా
నా(నా) యక్షప్రశ్నలకి జవాబులిచ్చేవాడివి.
ఉండుండి హఠాత్తుగా నువు భూమ్మీది కొచ్చి
నన్ను నిద్రలేపి
ఏ లెక్కకే సూత్రం సరిపోతుందో చెప్పి
సమస్య సూక్ష్మం వివరించి
సోదాహరణంగా ఓ సొల్యూషన్ యిచ్చేవాడివి.
అసలు నీ చేతిలో తెగని లెక్కంటూ ఉండేదా అని!
అలా చెపుతూండగానే
నిన్నేదో తిరగబెట్టి
నువు లోయల్లోకి జారిపోయి

ఏంద్రోక్లిస్, నీ సింహం గుండెలో
తీతువు ముక్కు గుచ్చుకుందంటూ
పెన్ను మూసేసి విశ్వాంతరాళాల్లోకి
ఓ ఒంటరి కేక విసిరే వాడివి.
నేను నీ దగ్గర నేర్చుకున్నాననే అనుకున్నాను.
ఇవాళ నేను ఆ పాటలే వింటూ
అవే లెక్కలు వేస్తున్నా.
లెక్క తెగట్లేదు నాయుడూ!
దత్తాంశమే ఫలితంగా వస్తోంది.
ఈ పాటల్లో నువ్వే భగ్నగీతంలా వినిపిస్తున్నావు.
నువ్వెలా చేసేవాడివో
గుర్తు తెచ్చుకుందామంటే
నీ మెళకువలు కాదు—
నువ్వే గుర్తొస్తున్నావు.
(జర్మన్ సినిమా "*Grunstein's Move*" చూశాక, మిత్రుడు నాయుడికి—)

* * * *

"ఆకాశం ఆశీస్సు చినుకు
మబ్బు మమకారం చినుకు.
చీలిన నేల పెదవిపైన
చిరునవ్వు ముత్యం చినుకు.
మోడు ముఖాన్ని చీల్చే
మొదటి చిగురు చినుకు.
గోరీ నెత్తిలో మొలిచే
పూరిగరిక చినుకు" —సి. నారాయణరెడ్డి

# హనీఫ్

## వర్తమానం ఓ పీడకల!

వర్తమానం
సిఫిలిస్ సోకిన రోడ్లపై నడుస్తుంది.
అంధత్వం క్రమ్మిన
హస్తాలతో కరవాలనం చేస్తుంది.
గాలి అదే పనిగా
అబద్ధాలనే చేరవేసే గోబెల్స్ వారసుడై పోయింది.
చెవులు చిల్లులు పడి,
మెదడు జ్ఞాపకాలనే మరమేకుల్ని
జార విడిచేసింది.
ఇప్పుడు,
ఒక్కొక్క అవయవానికి
రక్త ప్రసరణ జరగటం లేదు.
కుల రాజకీయాల హీన సంస్కృతి ప్రసరిస్తుంది.

మా బ్రతుకు గతుకుల రోడ్లపై నడవకండహో....
మీ నునుపైన పాదాలకు, మీ భావాలకు
రైతు చిందించిన రక్తం మరకలు తాకొచ్చు,
రైతు పిండిస చెమట వాసనలకు ముక్కులు బ్రద్దలు కావచ్చు
మీరు నీచంగా భావిస్తున్న హీన సంస్కృతి మాది.
మా చెమట మడుగునుండి ఉదయించే సూర్యుడివల్లే-
మీ టెర్లిన్, టెరికాట్ తెల్ల చొక్కాలపై
మా నరాల తెల్ల జిలుగు మెరుస్తుంది చూడు
మీ భవిష్యత్ అంతస్తుకు ఈ చెమట రేణువులే పువాదులనే వాస్తవాన్ని,
ఏ సైన్స్ ఫార్ములా క్రిందనో,
ఇరవై ఒకటో శతాబ్దపు నూతన ప్రయాణం చక్రాలక్రిందనో,
మీరు జార విడువ వచ్చు.

అంత మాత్రాన ...
మీ ఆనందపు విహార ప్రయాణానికి,
పల్లకి మోస్తున్న వాళ్ళమని మాత్రమే అని భ్రమించకు.
మా పాదాలకు నడవటం ఒక్కటే అభ్యాసం కాదు
మా చిట్లిన పాదాల నెర్రెల్లో తొంగి చూడు
ఏ ఏ రాజ్యాలు ఎందుకు–
ఎలా కూలతోయబడ్డాయో... !?
ఎందరు రా రాజులు పదవీచ్యుతులయ్యారో....!!
మా పాదాల వెంత ఎన్ని జయాలో....
ఎన్నెన్ని విజయాలో....!!

** ** ** **

"కళ్లెం ఉన్నది మన చేతిలో,
గుఱ్ఱం మాత్రం పడె గోతిలో;
దప్పి తీరదని నేనంటాను
నీళ్లే అందని మన నూతిలో

పడవ నడపలేనివాడు నావికుడు
పదము పాడలేనివాడు గాయకుడు
అందుకనే వేదనతో నేనంటాను
ప్రజల నడపలేనివాడు నాయకుడు" —దాశరథి

## సౌభాగ్య

### ఇంద్రజాలం

ఆకాశం అక్వేరియం మీది నించీ అదృశ్యహస్తం
ఉల్లి పొరలాంటి ఉష్ణవస్త్రాన్ని మృదువుగా తొలిగించింది.
నిలువెల్లా నైల్యంతో నిగనిగలాడిన
నీలి గోళ గర్భంలో నిఖిల ప్రపంచమూ
శీతల చందనంతో పులకించింది.
సాయంత్రం అంతవరకూ లేని పాల మేఘం
అగాధాలనించీ లేస్తుంది.
సూర్య దీపకళికని శూన్యంలోకి జారవిడిచి
మేనంతా కరుగుతున్నట్లు మైనపు వొత్తి మేఘం
కాటుక నలుపుతో కదలి వస్తుంది.
రెంటికీ నడుమ సెర్చిలైట్లు వెలిగినట్లు కిరణాలు దూసుకుపోతాయి.
అన్నిటినీ తప్పించుకున్న చిన్ని మేఘం
అణువణువులో ఇంద్రచాపాన్ని అంతర్లీనం చేసుకుని
చలనం లేకుండా నిలిచి పోతుంది.
ఆకాశపు అంచులకు అతుక్కుని
అసంఖ్యాక తంత్రులుగా విడిపోయిన మేఘాల మెట్లని
చూసే కళ్ళు సున్నితంగా మీటుతాయి.
విచ్చుకున్న చంద్రకాంతంపూల కుంకుమవర్ణ వలయతరంగాలై
కాంతి పాలపుంతల్ని సృష్టిస్తాయి
రంగురంగుల వస్త్రాలతో ఉల్లాసంగా తోటల్లో తిరిగే అమ్మాయిలు
మట్టికి ప్రాణం పోసే మంత్రగత్తెల్లా వుంటారు.
డాబాలని కప్పిన సన్నజాజి తీగల్లో ఆపాదమస్తకం విచ్చుకుని
కళ్ళార్పని పూలకు కల్లాకపటం తెలీదు.
మల్లెమొగ్గల బుంగ మూతులు చూసి
కనకాంబరాలు కమ్మగా నవ్వుతాయి.
పది అంతస్థుల పైన నిలబడి పర్యవేక్షించే పక్షి
హఠాత్తుగా రెక్కలు విప్పి అంతరాళంలో డైవింగ్ చేస్తుంది.

ఇల్లు కట్టడానికి కుప్పపోసిన ఇసుక
పసి పిల్లల పాదాలకు ప్రాణాల్ని ఇచ్చేస్తుంది
నీళ్ళ పూనకం వొచ్చినట్లు నిమ్మళంగా కదుల్తాయి చెట్లు
ప్రతి ఆకూ అంచుల పెదవుల్తో
మృదువుగా నీలిమని ముద్దు పెట్టుకుంటుంది.
నడిచే మనుషుల్ని
పరుగెత్తే వాహనాల్నీ చెట్లు పరిశీలిస్తాయి,
చెట్ల మధ్యలో ఇళ్ళు బెమ్మగా ఫీలవుతాయి.
ఇళ్ళపై గద్దలు ఈలవేస్తూ తిరుగుతాయి.
గద్దలకు అందని గంభీర పర్వతాలు
గర్వంతో విర్రవీగుతాయి.
పర్వతాల్ని దాటి పరుగెత్తే విమానాలు
పొగల సరిహద్దులు గీస్తూ పొగరెక్కుతాయి.
వెల్లువలా లేచిన మేఘం విమానాల్ని మింగుతుంది.
విశాల నీలిమతో విశ్వగోళం
దృశ్యాలని ఇముడ్చుకుంటుంది.
ఆకాశం అక్వేరియం అటూ ఇటూ కదుల్తుంది.
పిచ్చి పట్టిన గాలి పిడుగులు కురిపిస్తుంది.
ఆకాశం గాజు నెర్రెలు చీలినట్లు
దట్టమైన నలుపు దళసరిగా దూరుతుంది
చీమనించీ భూమి సమస్తం
చీకట్లో మునిగి పోతుంది.

* * * *

"అంధుని
కనురెప్పలపై కన్నీరు
నా గీతం!" — నారాయణబాబు

# వి. ఆర్. విద్యార్థి

## పువాది

అది ఒక శీతాకాలపు వేకువ;
ఆ నీలి బంగారు సూర్యోదయంలో
బద్ధకంగా మా సరిహద్దు భూశకలం
పొగమంచు నిద్రసంచిని విప్పుకొంటుంటే
హడావుడిగా మేము విమానంలో చేరి
ఆకాశంలో దూసుకుపోతున్నాం.
పైలట్ ప్రక్కన కూర్చున్న నాకు
వో గాజు బెలూన్లో పయనిస్తున్న అనుభూతి.
అదంతా మబ్బుల ప్రపంచం
కాలమేఘాల గుహల దూరుతూ
తెలిమబ్బుల తలలు దువ్వుతూ.
చుట్టూ మేఘాల అరణ్యాలూ
పర్వతాలూ, సముద్రాలూ
హఠాత్తుగా బుద్ధుడి బోధి వృక్షంలా వో పెద్దమేఘం!
మబ్బుల లోకంలో
గ్రహాంతరవాసుల్లా మేమంతా
అందని ఆలోచనలా.
విమానం
మబ్బుల ప్రపంచాన్ని దాటి
నీలి లోకంలోకి.
చుట్టూ నీలి దీవులు
ఒక్క పైలట్‌కు తప్ప
మా కెవ్వరికీ ఎక్కడున్నదీ తెలీదు!
అసలు మేము కదులుతున్నట్లే అనిపించదు.
అప్పుడప్పుడో మబ్బుతునక మా
ప్రక్కనుంచి దూసుకుపోతే
మా వేగానికి అబ్బురపడే వాళ్ళం!

క్రింద సముద్రాలూ, పర్వతాలూ
అడవులూ, మైదానాలూ నదులూ
అన్నీ సరిహద్దు రేఖలు కోల్పోయి
గుళ్ళూ, గోపురాలూ
మసీదులూ, చర్చిలూ, పగోడాలూ
అన్నీ ఉనికి కోల్పోయి
ధూళిగా భూమిలో కల్సిపోయి.

ఎగిరే జెండాలూ
గర్జించే శతఘ్నులూ
ఏ మూలా కన్పించకుండా
అన్నీ అనాకృతమై
అంతా నిశ్చలమై
నిశ్చలతలో అంకురించిన ఆనందమై.

•

అవునూ
ఈ అంతులేని ఆనందానికీ
ఆనవధి నీలిమండలావతరణకూ
ఏమిటి మూలాధారం?
శ్రామిక హస్తాలు
శాస్త్రజ్ఞుడి మేధస్సూ
పునాదిగాలేవూ?!

* * * *

"చినిగిన స్వప్నపు సంచీలో
చితికిన బాష్పం నిలవదు
అందుకే నేస్తం జీవితమే ఒక జూదం
ఖేదానికి మోదానికి లేదసలే భేదం" —తిలక్

## స్వర్ణా సుధాకర్

### మాతృమూర్తి మనసు....

గుండె లోతుల్లోంచి ఉరికి రావాలని
భావం చేసే ఆరడి....
గొంతు గుడిలోంచి వెలికి రావాలని
భాష చేసే సవ్వడి....
భాషకూ.... భావాలకూ
సమన్వయం కూర్చాలని
మనసు చేసే సందడి
భావం.... భాష కందక
ఎదలో తెలియని అలజడి
అంతులేని రూపాల ఉరవడి
ఆశానిరాశల.... ఆందానందాల
నిశ్శబ్ద శబ్ద ధ్వని తరంగాలు
కనుల కొండల్లోంచి జాలారే కన్నీటి సెలయేళ్ళు
భాష్యం చెప్పమని వేధిస్తుంటే
భరించలేని ఆవేదనా జ్వలన
భాషకూ.... భావాలకూ నిత్య సంఘర్షణ
భావనాలోకపు నీలినీడల జాడల్లో
అలసి.... సొలసి
మిగిలిపోయిన గురుతులు
భాష మౌనంగా నిలిచింది
రూపురేఖలు సంతరించుకోని కవితా శిశువు
జీవాత్మను పొంది
సజీవాకృతి పొందలేక
ఎదలో విచ్ఛితి నొందినవేళ
మాతృమూర్తి మనసు పడే వేదన
ఇలా....
శకలాలుగా.... ఖండఖండాలుగా....

## మధుసూదనరావు

### వైధవ్యంలో వృక్షం

ఈ తలుపులు ఎప్పుడూ మూసుకోవు!
ఎప్పటిలా తెల్లవారుతుంది
చీకటి ఆకాశం తన పరదా లాక్కొని
ఏ దిగంతాలకో పారిపోతుంది
పచ్చని ఆచ్ఛాదనకు దూరమై
బతుకు వెచ్చదనాలకు వెలియై
వస్త్రానికి బిగిసిన
ఒంటరి తలుపులకు
ఏ నేస్తాలూ లేరు!
కాని వచ్చే పోయే వాళ్ళ
అంతరంగాలు సతతం
రికార్డ్ అవుతూనే ఉంటాయి!
కన్నీళ్ళు కార్చి కార్చి
కళ్ళే పోయాయి తలుపులకు!
ఈ కబోది తలుపులు
కల్తీలేని నరాలతో
కొత్త ఆలోచనలను
పురుడు పోసుకుంటూ
ఇంకా తలుపులు గాని
చెట్లను హెచ్చరిస్తూనే ఉంటాయి!

## త్రిపురనేని శ్రీనివాస్

### న్నిర్ఘుంగా

రాత్రి నా కన్నుల్లో నిద్రపోవాలని
పుస్తకం నా పేజీలు తిరగెయ్యాలని
కవిత్వం నన్ను రాయాలని
తపనతో తన్మయత్వంతో తదేకంగా నేను
నా చుట్టూ విరిగి పడుతున్న కన్నీరు
కింద ఆకాశం
పైన భూమి
రాలుతున్న సముద్రాలు
దేశం తల్లకిందులుగా
రోడ్లు లేని నగరాలుగా
ఎవరూ లేని కిటకిటగా
పదాలు లేని పద్యాలుగా
గుండె కాయలు లేని చర్మం తొడుగులుగా
నిజంగా
న్నిజంగా
న్నిర్ఘుంగా.

# దేవరాజు మహారాజు

## కలర్‌ఫుల్ బ్రౌన్ షుగర్

జీవితంలో దొరకని వన్నీ
దొరికే కల-టీవీ తెర!
నిన్నా-ఇవ్వాళా-రేపు
ఎపిసోడ్‌లు ఎపిసోడ్‌లుగా
నీ బతుకు ఇప్పుడొక రోజువారీ సీరియల్
అర్ధాంతరంగా ఎప్పుడాగి పోతుందో,
ఇప్పుడయితే తెలియదు–
బాల నాగమ్మ సినిమాలో
మాయల ఫకీరు మాయా దర్పణం లాగా
ప్రపంచ మంతా నీ కళ్ళ ముందు గిర్రున తిప్పి
నిన్నో వెర్రి నాగమ్మను చేస్తుంది.
ఏ దేశపు రాజైనా సరే
నవ్వుతూ నీతో కరచాలనం చేస్తాడు
'దేశ్ కి కోనె కోనేమె ఆజ్ క్యా హెూరహాహై
హమే ఏ భీ దేఖ్ నా హై'
గొంతెత్తి ప్రతిరోజూ ప్రధాన మంత్రి
స్వయానా–నీ చెవిలో ఇల్లు కట్టుకుంటాడు.
ఎంతటి హీరోయిన్ అయినా సరే
నీ బెడ్ రూంలో అందాలొలక బోసి వెళ్తుంది
గవాస్కర్, నీ పిల్లల చేతికి బ్యాట్లిచ్చి రోడ్లెక్కిస్తాడు.
మరో వీర సావర్కర్ బ్యాగ్రౌండ్ మ్యూజిక్‌తో
క్షణాల మీద ఉత్తేజాన్నిస్తాడు.
శనివారాలు బిర్లా టెంపుల్ మెట్లెక్కే పని వుండదు.
ఆదివారం పొద్దున్నే త్రేతాయుగంలోంచి హుటాహుటిన
శ్రీ సీతారాములే దిగివస్తారు
నీ వానర సైన్యాన్ని చూడ్డానికి–
మధ్య మధ్య వ్యాపార సౌఖ్యాల ప్రకటనలు

నీ జీతం రాళ్ళతో దోబూచు లాడతాయి
లలితాజీ, సర్ఫ్ ఎందుక్కొంటుందోననే బ్రహ్మరహస్యం
అరగంటకోసారి చెప్పి నీ సమర్థుదారీని గుర్తుచేస్తుంది

నిన్న నీ నోట్లో నాలుక లేదు.
ఇవ్వాళ టి. వీ తెచ్చావో లేదో,
రేపు మాస్కో ఆఫీసు వక్తల్లో
నువ్వొ సభ్యుడివై పోతావు.
నీ స్టార్స్ గురించి ఏమో తెలియదు
స్టార్లంతా దగ్గరి ఆత్మీయులై పోతారు
నీ ఇల్లంతా కలిపి ఒక్క గదేనని బాధపడకు
ఇప్పుడది స్టేడియం-కం స్టూడియో-కం థియేటర్.
స్నేహాలు, చుట్టరికాలు, అన్యాయంగా, అసహాయంగా
చిన్న తెర మీది కార్యక్రమాల చుట్టూ తిరుగుతాయి.
సినిమా రోజైతే, నువ్వింట్లో వుంటావని
అందరికీ తెలుస్తుంది.
పొద్దునెప్పుడో కాలిన పక్క ఫ్లాట్ సంగతి
సాయంత్రం వార్తల్లో తప్ప తెలియదు.
భార్య తప్పిపోయిందని ప్రకటించి,
నువ్వు విడిచి పెట్టిన సంగతి కప్పి పుచ్చుకుంటావు.
నీ బతుకు మీద నవ్వేందుకు
అఖిల భారత హాస్య కవి సమ్మేళనం ఏర్పాటవుతుంది.
వాళ్ళెందుకు నవ్వుతున్నారో వాళ్ళు తెలుసుకునే లోపల
నువ్వు భోరున గుక్క పట్టి యేడుస్తావు.

నీ మీద నీకే జాలేస్తుంది కదూ
నీ మీద నీకే కోపం వస్తోంది కదూ
సిద్ధాంతాల ఆయుధాలు తిప్పుతూ
ఖండవాదులు, ప్రచండ వాదులూ తిరుగుతున్న కోనలో
తిరగ లేననుకున్నావ్ కదూ
నిజమనిపించే అబద్ధపు పాటైనా సరే
లిప్త కాలం పాటు జో కొట్టాలనుకున్నావ్ కదూ

అంతే! ఈ వ్యవస్థకు కావల్సింది అదే–
దాని పథకం విజయవంతంగా పని చేసింది.
నాగస్వరానికి బుస్సున లేచే
బుట్టలోని నాగుకు కోరలుండవు
నువ్వక ముట్లముట్టుకుని బుట్టలో బజ్జో–
కేడ్‌బర్రీస్ సంస్కృతి ఇస్తున్న 'కీ' కి
ఉన్న చోటే గుండ్రంగా తిరిగే లియోటాయ్‌వి?
ప్రపంచాన్నంతా చిన్న పెట్టెలో ఇమిడ్చిన
సజీవ–రాబోట్‌వి!!

నువ్వు పుట్టి పెరిగిన మట్టీ
అడవులు, వూళ్ళూ, గాలీ, నీరు
నీకిప్పుడు చాలా దూరం
అప్పుడప్పుడు సరదాగా, వాటిని కూడా
నీ సాంకేతిక దర్పణంలో చూసుకో-

* * *

"అలజడి మా జీవితం,
ఆందోళన మా ఊపిరి.
తిరుగుబాటు మా వేదాంతం.
ముళ్లూ, రాళ్లూ, అవాంతరాలెన్ని ఉన్నా
ముందు దారి మాది.
ఉన్న చోటు చాలును మీకు.
ఇంకా వెనక్కి పోతామంటారు కూడా
మీలో కొందరు.
ముందుకు పోతాం మేము.
ప్రపంచం మా వెంట వస్తుంది" —శ్రీశ్రీ

# కొండేపూడి నిర్మల

## ఆలోచించు

ఒక మూగవాడు నయం.
ఆత్మను అవసరానికి మేక్కొట్టి
శతాబ్దాల నిశ్శబ్దంగా గడ్డకట్టుకొని పోయిన నీ కంటే—
వాడు గొంతు ఊబిలో కూరుకుపోయిన మాటకోసం
యుద్ధభేరిలా మోగుతాడు.
ఒక గుడ్డివాడు నయం
స్పర్శజ్ఞానం కోల్పోయిన చూపులతో
దోపిడి శక్తులవైపు కళ్ళు మూసుకుని నమస్కరించే నీ కంటే—
వాడు గాల్లో కరిగిన నిట్టూర్పుకి ఆకారం తొడిగి
చీమ పిలిచినా పలుకుతాడు
ఒక కుంటివాడు నయం
కాలు కదపలేని స్థితికి కావలసినంత
కారణాన్వేషణలో పొద్దుపుచ్చే నీ కంటే—
వాడు గడియారం ముల్లయి లోహపు మెట్లెక్కుతున్న
టిక్కుటిక్కు శబ్దాలతో రోడ్డురోడ్డంతా చిటికెన వేలుతో నడిపించుకుపోతాడు
ఫ్రీజర్‌లో శవం చెడిపోదు
చప్పుడు చెయ్యదు
అచ్చంగా అక్కడెవరో నిద్దరోతున్నట్టే వుంటుంది,
పుట్టింది లగాయితూ నీలో ప్రవహిస్తున్న యిన్ని నదుల రక్తమూ
ప్రాథమిక శారీరక అవసరాల పూరణకే అయితే ఫర్వాలేదు
చివరికిది కాలహరణంలో నువు వాల్చిన
మృత్యు విశ్రాంతే అయితే మాత్రం ఆలోచించాల్సిందే.

(విద్వాన్ విశ్వం స్మారక బహుమతి పొందిన కవిత)

## పెన్నాశిరాకృ

### ఖైదీ స్వగతం

(మా సమస్య పోరాటాలా వద్దా అనేది కాదు—
పోరాటాన్ని ఎలా కొనసాగించాలన్నదే)

నన్ను నేను మరచి పోవడానికి తగినంత
సమయం ఇస్తున్నారు అయినా
నా విశ్వాసాల రాపిడిలో కరుగుతున్న
కటకటాలు నా కర్తవ్యాన్ని గుర్తు చేస్తున్నాయి
ఈ ఇనప ఊచలకు బయట ఉండడమే స్వేచ్ఛ అయితే
ప్రతిఘటనా శక్తులను పొదుగుతున్న చెరసాలే మేలు
జన్మహక్కు కోసమే
మనం గొంతును వ్యక్తిత్వాన్ని
సర్వ శక్తులను అమ్ముకోవాలా?
అన్ని అక్షరాల అంతః స్వరం
వాళ్ళ దమన నీతినే చాటుతున్నప్పుడు
ఎన్ని వార్తల మీద తారు పూస్తారు?
అన్ని గొంతుల మీదా కత్తులు పువ్వుస్తున్నప్పుడు
మూరెడు కర్రవాడికి
మూడో కాలైనా కాదుగదా!
ఐరోపా బోదకాలి రబ్బరు ముళ్ళ పాదాల క్రింది
నిప్పుల కుంపటి ఆఫ్రికా కావచ్చు
ఆసియా మెదడు వాపుకు కుక్క మూతిపిందె
మరేదైనా కావచ్చు
అన్నింటికీ నమూనా ఈ నాల్గు గోడలు
ప్రతి దేశమూ ప్రపంచానికి కేంద్రబిందువే
వాళ్ళు హత్యలకు వామాంత రాలను
రూపొందిస్తున్నారంటే
మన చావును బ్రతుకుకన్నా బలీయ శక్తిగా

రూపొందిస్తున్నారన్న మాట
నలుగురు చేరిన చోట
నా గురించే మాట్లాడుకుంటే
ప్రజలు నా దేశాన్ని గురించి ఆలోచించినట్లే
నా శరీరాన్ని ప్రశ్నిస్తున్న లాఠీలు
మనిషిని మానని గాయంగా మారుస్తున్నప్పుడు
ఇక్కడ ఉన్నందుకు నేను నిట్టూర్పులు విడవనవసరం లేదు.
గుండె శబ్దపు సంగీతంలో
నా అడుగులే వేనవేల పద ధ్వనులుగా
నా స్వగతాలు బృందగీతాలుగా మారే రోజుకోసం
కలలు కంటున్నాను.

** ** ** **

"కేవలం మంత్రులూ అధికార్లదే తప్పంటే నేనొప్పుకోను
ప్రతిరోజూ నైవేద్యం పెట్టందే పలకరు దేవతలు కూడా
ప్రతిరోజూ నైవేద్యం పెట్టే తాహతే ఉంటే
ఒక పూట పస్తెందుకుంటారు దేశంలో ప్రజలు?" —కుందుర్తి

# అనుముల కృష్ణమూర్తి

## కవిత

ఓ కవీ! నీవు దేవతానీకమునకు
ఘనభిషగ్వర ధన్వంతరిని దలంచి
వాక్కు వాడవలె జనశుభాస్పదముగ-
శత శివేతరక్షతి మహేశ్వరము సుమ్మి

పద్య బిల్వార్చకుడ నేను; ప్రభువ వీవు
శతకముల్ దాటె. ఇవి సహస్రకములయ్యె
శృతి శరచ్చంద్ర! ఘనజటోష్ణీష! ఇంక
ఎన్ని యర్పించ మందువీ ఎదతరువును?

ప్రత్యుష స్సుందరీ స్వర్ణఫాలమందు
ముద్దు తిలకమ్ము దీర్చి పంపుదురె వారొ!
వారి ముని వ్రేళ్ళ సొగసు కన్నారగాంచు
భాగ్యమున్నదొ నా కన్నవలకిహాన?

# తుమ్మపూడి కోటీశ్వరరావు

## బిందు పింఛము

మినుతేడు సవరించె మించు జరీయంచు
            వలెవాటు భూకాంత జలదరింప
అరదంపు సవ్వడుల్ పరువెత్తె గర్జలై
            భువి పుట్టగొడుగును మొలకలెత్తె
వాంత హైమాంబువుల్ వడి జల్లులై రాలె
            స్వేదాశ్రు స్నిగ్ధాంగ పృథ్వికాంత
చిత్రేక్షుచాప వర్షిత పుష్పకరకల
            పలుగంట్లు గండ్లయ్యె వసుధ మోము
గ్రీష్మ ఋతుదగ్ధ కుబ్జికా క్షేత్రమెల్ల
మొగిలు తావుల పసిపట్టు చిగురుచీర
దాల్చి—హాల నఖక్షత సస్యగర్భయయ్యె
నవనవోన్మేష మందాక్ష నత శిరస్క. 1

"నేనెపుడు చూడలేదే
దానిని, హృదయంగమూర్తి భావజుడౌనా!!"
"నీనోటినుండి యమిత
ప్రాణ సుశబ్దావతార రమ్యత యెట్లే?" 2

"నేను చెప్పినదేమి? ఓసి నేరేటి పండా!! ఇదేమి?"
"నేను నీలనుగాని కుబ్జ!! నేరేటి పండునుగాను"
"వాని సంగతి నీల! చెప్పు"—"భావ చోరుడెచట తోచె"
"వానలో గోవర్ధనాద్రి పాదమున నొదిగినపుడు 3

స్వచ్ఛ జీవుడు హృదభ్రమున వెల్గినయట్లు
            కాళిందిలో తెల్లు పూలు నవ్వె
ప్రాణముల్ ధౌతమై వ్రజనాభుపై వ్రాలి
            నటు పొన్న విరి గుత్తులౌచు వ్రేలె

నెమలి చట్టుపల వన్నియలు నింగికి చింది
నట్లబ్దమాలపై హరిధనుస్సు
నేరేటి పండ్ల వన్నెల మూలందోగి
కలిగొట్ల మాగుతావులు సుడిసెను
మామిడి చిగుళ్ళ మెసవిన మత్తకోకి
లల గళమ్ములై వెదురు బూరలు స్వనించె
చైత్ర రాకేందు బింబమై చలువలార్చె
నా హృదబ్జము ప్రకృతి సౌందర్యమగుచు 4

అతడు మురళినూదె అదియేమొ?!! నా వెన్ను
పాములోన ఏదొ ప్రాకినట్లు
మత్తు క్రమ్మినట్లు మౌన సౌఖ్యముగంటి
అనుభవమ్ము నీకు నట్లుకలదా?! 5

రాలలో మధు మురళీరవాలు వింటె
యమున జలముల నెమలి పింఛములు కంటె
సంజలన్ కాంచనాంబరాంచలము లారె
కానుగుల చాయ తత్తనూకాంతి కంటె 6

మబ్బుపట్టిన వేళ శ్యామలపలాశ
తరు పరిచ్ఛన్న గిరి పార్శ్వ తలములందు
గోవులను చూచితిన యేమి భావమందు
వేణువూదుచు వాడె కన్పించునేమి 7

గోవర్ధనాద్రి సానువుల గోగులు పూచినయట్లు
గోవర్ధనాద్రిపై ఆల గుంపులు పారాడినట్లు
గోవర్ధనాద్రి శీర్షమున క్రొత్త జాబిలి బిళ్ళపొడిచె
గోవర్ధనోద్ధర్త–పెదవి క్రొక్కారు మంకెనల్ పూచె 8

అదియేమి? పాంచజన్యపు ముడుతల రేఖ
లందలి కాంతి నైల్యముల జాల
మా?! శరత్ చంద్ర బింబ మయూఖములలోన

జిలుగు వన్నెల నీలిమల చలనమ?
పిల్లగాలులకు కంపించుచు నల్లని
కల్వ శూన్యమునందు కదలునేమి?
మఘవ మాణిక్య సంభవ కాంతి మృదురేఖ
గవియందు లీలగా కదలునేమి?
అనగ భూమిపై భారావహమ్ముగాగ
నడువ కట్టులే గాలిపై కడచినట్లు
నడుమ చున్నట్టి ఆ విరంతన మరీచి
చూచితిని మనః కల్పములే సుప్తముగను. 9

*  *  *

"తన చేతి కుంచె కాదర్శమ్ము కాదగు
రేఖగలట్టి యాకృతియె లేని
తన కన్నుగవకు విందొనరించి యాకట్టు
రమణీయతర పదార్థమ్మె లేని
తన బాచు హస్తాగ్రమును బ్రీతి గైకొని
కైదండ గూర్చెడి కరమె లేని
తన కళాభారతీ దరహాసమ్ముఖ వీక్షణము
సేయగల సహనమ్మె లేని
వికృత-సౌందర్యరహిత-విద్వేష భరిత-
మర్త్యలోకమ్ము రోసి యమర్త్య భువికి
వెడలిపోయెను బాపిరాడ్విశ్వ శిల్పి
సరస సౌహార్ద ముగ్ధ ప్రసన్న మూర్తి!"
"విశ్వశిల్పి"—ఆచార్య పింగళి లక్ష్మీకాంతం

## ఎల్. భూదేశ్వర్రావ్

### నా ద్విపద

ఏమి జదివి తీవు? ఎంత నేర్చితివోయి?
సంకెళ్ళనుండి స్వేచ్ఛవరకు.

సృష్టియంతయునెంతొ దుష్టముగ తోచె
దృష్టాంతమున కొక్క దుఃఖాశ్రువే చాలు!

స్పర్థ మనుగడకు చిరకాల విరోధి
స్వార్థమె మనిషికి నిలువెత్తు సమాధి

పుట్టిన ప్రణాళికలన్ని పురిటిపాలు
మంత్రసానికేమొ ముత్యాల సరాలు!

దుఃఖకడలి నెడద దాచగవచ్చు
కనుల పొరలు నదుల నాపతరమె?

నటనమున జీవించి తీరవలయు; కాని
జీవనమున నెపుడు నటన సేయరాదు.

కవితలోను మరియు కాంతతోను
ముచ్చటింపగ రాదు ఒక్క వ్యర్థపదమేని.

తప్పిద మొనరింపగ 'తృటియె' జాలు
చక్క జేయనొక 'జన్మ' చాలదు సుమ్మి!

ఆకలి కౌషధమ్ము జూపి,
అంతరిక్షమ్ము శోధింపు దావల!

## పో చూ-యి
(క్రీ.శ. 772-846)

### వేదాంతులు

లావో-త్ జూ

"మాట్లాడే వాళ్ళకేమీ తెలియదు;
తెలిసిన వాళ్లు మౌనంగా ఉంటారు."
నాకు తెలిసి, యీ మాటలన్నది, లావో-త్ జూ
కాని
లావో-త్ జూయే అన్నీ తెలిసిన వాడని
మనం నమ్మితే
అయిదు వేల పదాలతో
అతడొక పుస్తకం ఎలా వ్రాశాడు?

చూయాంగ్-త్ జూ

అన్ని వస్తువుల్నీ సమానం చేస్తాడు చూయాంగ్-త్ జూ
ఒకే ప్రాథమిక జీవికి సరిపోయేలా వాటిని తగ్గిస్తాడు.
కాని నేనంటాను వాటి సమానత్వంలో కూడా
భిన్నత్వం కనబడ వచ్చని.
వాటి ప్రకృతి ప్రోత్సాహాలను అనుసరించడంలో
అవి ఒకే ప్రవృత్తిని ప్రదర్శించినప్పటికీ,
నాకనిపిస్తుంది కొన్ని రీతులలో
ప్రాకే జంతువుకన్న ఫీనిక్సు ఉన్నతమైనదని!

(ఆర్థర్ వ్యాలీ ఆంగ్లానువాదానికి తెనిగింపు- తంగిరాల)

# రసూల్ గమ్ జాతోవ్

## 'అమ్మ ముద్దుగా పాడుతుంది పాట'

కొండల్లో చెప్పనలవి కాని మంచు తుఫాను?
మరి నా గుండెల్లో
మొండిగా మెదలాడుతూంది
అమ్మ వూపిన వుయ్యాల
అమ్మ చేతులే కదా
ఆనాడు యేనాడో
ఆశతో బెంగతో
అవింత ఆత్రంతో వుయ్యాల వూపాయి?
రక్షణ కల్పించిన అపేక్ష నీడ కింద
అమరంవై అస్తమిల్లని వెలుగుతో
నా మనుగడ నడుస్తున్నా
నే పసివాణ్ణే ఆమె కంటికి
ఇదంతా యేనాటి మాటో
మరీనాడు నేను తండ్రిని.
నా గుండెల్లో సర్వం మెదలాడింది
సర్వం లోలకంలా ఊగిసలాడింది.
మళ్లీ మార్మికంగా నక్షత్రాలు
ఆమె మకుటంవై వెలిశాయి
జగమంత నీ వుయ్యాల్లో వూపుతూ జోలపాడుతున్నట్టి
ఆమె నవ్వుతూ కంట తడి పెట్టుకుంది
ఉయ్యాల వూగుతుంది. గాలిలో తేల్తూంది
ఆమె చెంతని
మరి విచారం విస్మరించక
అమ్మ ముద్దుగా పాట పాడుతూంది
జగత్తు సర్వాన్నీ ఓదార్చుతూ

(తెనిగింపు : పుప్పాల లక్ష్మణరావు)

పాకిస్తాన్ కవిత

## మునీర్ నైయాజి

### ఒంటరితనం

చీకటి రాత్రి-నేనూ-ఈ శూన్య గృహం
తీవ్రంగా వీస్తున్న గాలులు
బాదుకుంటున్న తలుపులు
లాబీలో మిగిలిన ఒకే ఒక్క గులాబి

ఇప్పుడిక నేనూ–ఈ శూన్యగృహం మాత్రమే
ఉధృతంగా వీస్తున్న గాలులు
కొట్టుకుంటున్న తలుపులు
చిక్కటి విషాదం పూసిన గోడలు
కంట్లో రాలిన 'నిన్నటి' ధూళి జాలిగా
కళ్ళను తడి తడి చేస్తోంది.

(ఆంగ్లంనుండి అనువాదం–డా. దేవరాజు మహారాజు)

కవితా ఆసియా–భోపాల్, భారత భవన్‌లో మార్చ్ 1988న జరిగిన మొదటి అంతర్జాతీయ కవితోత్సవంలో చదివిన కవిత.

# అజ్సా జహిరోవిక్

## పత్నికి

నీనుంచి సిగ్గుకు
కొద్దిదూరం
నీనుంచి హృదయానికి
ఒక వంద కట్టుబాట్లు
ఒక వంద గడపలు
ఒక వంద పర్వతాలు
ఒక వంద అక్షరాలు
నీకూ పెదవికీ మధ్య—
ఒక కత్తి
నీనుంచి నాకు
ఒక దారి.

## ఎవరివో మాటలు

ఎవరివో మాటలు రెక్కలు కొట్టుకుంటాయి మనవైపు
ఏర్పడతాయి వలయాలుగా త్వరత్వరగా
ఎవరివో మాటలు తప్పి పోతాయి పశువుల తొట్టిలోకి
అక్కడ వాటి జాడలు తీస్తాయి
ఎవరివో మాటలు, సంతోషంగా ఉన్నప్పుడు
అశాంతిని తెస్తాయి మన రక్త ప్రవాహాల్లోకి.

(ఇవో సోల్‌జన్ ఆంగ్లానువాదానికి తెనిగింపు—శంగిరాల

## సి. ఎస్. సవిత

### కవిత తీసుకురాదు చెలి, నవ వసంతం

కవిత తీసుకురాదు చెలి
నవ వసంతం.

అడవిలో చెట్లు మొలిచింది
వేర్లు ప్రాణం పోసింది
వసంతుడు రంగు పూసింది
ఈ మట్టిలోనే.

సూర్యచంద్రులు నింగిలో
పుట్టినా........ చెలి
వారి కలలన్నీ నేలలోనే
పువ్వులై పూచింది.

మైథిలి కలలన్నీ
వాల్మీకివి కావు సుమీ
ఈ మట్టిలో ఆ సీత
చల్లి పండించినవి—
నీవీ
నావీ—
చెలి, తీసుకురాదు కవిత
నవ వసంతం

(తెనిగింపు—ఎస్. రఘునాథ)

మలయాళ కవిత

## కె. సచ్చిదానందన్

### శిలాకృతి

ఈ రోజు మా కవిగారి విగ్రహం
ఈ సందు గుండా ఊరేగింది.
మాటలూ కదలికలూ అణగిపోయిన ఇత్తడి పెదాలమీద,
రెండు పిడుచుల కాంగ్రెస్,
ఒకప్పుడు తుఫానులు రేపిన
ఆయన చూపుడు వ్రేలును ఒక కాకి దర్శిస్తుంది
పవిత్ర తరమై తిరిగిపోతుంది.

ఇదే సందుగుండా, ఒకప్పుడు వెళ్లింది
మా ప్రియమైన రాజుగారి శిలావిగ్రహం,
ఆయన గంభీర పురాతనాకృతి ఈ రోజు
రోడ్ల కూడలిలో ట్రాఫిక్ కంట్రోల్ చేస్తోంది.

ఆ తర్వాత కూడా, ఎందరు చక్రవర్తులు, రాజకీయ వేత్తలు
నాయకులు, చిత్రకారులు, సేనాధిపతులు ఊరేగింపబడలేదు
ఈ సందుగుండా!
అందరూ నిలబడతారు నగర భవనాల ముందు దిష్టి బొమ్మలుగా.
హఠాత్తుగా కాలం నిలబడుతుంది నా ముందు
ఒక దుష్టమంత్రగత్తెగా
బ్రతికివున్న ప్రతిదాన్నీ విగ్రహంగా గడ్డ కట్టిస్తూ

చనిపోవడమంటే
ఒక దిష్టి బొమ్మగా అవడం.

(ఎన్. ఎస్. మాధవన్ ఆంగ్లానువాదానికి తెనిగింపు—తంగిరాల)

# చైతన్య కవితా వేదిక

అధ్యక్షులు : ఆచార్య తంగిరాల సుబ్బారావు

కార్యదర్శి : డా. ఆర్వీయస్. సుందరం

కోశాధికారి : ఆచార్య సరగు కృష్ణమూర్తి

సహకార్యదర్శి : శ్రీ పి. యు. బి. శర్మ

## పోషకులు (1987–88)

శ్రీయుతులు

21. వెంకటలక్ష్మి, సి హెచ్. వి. బి. సుబ్రహ్మణ్యం దంపతులు, హైదరాబాదు.
22. హేమలత, బులుసు వెంకట సత్యనారాయణమూర్తి దంపతులు, రాజమండ్రి
23. జలజ, ఎం. రుక్మాంగద నాయుడు దంపతులు, బెంగుళూరు.
24. శారద, కె. యస్. ఆర్. ప్రసాదరావు దంపతులు, గుంటూరు.
25. చిరంజీవి తంగిరాల వేంకట శ్రీరామ ఫణి ప్రసన్న తేజస్వి (తంగిరాల సుబ్బారావుగారి పౌత్రుడు), బెంగుళూరు

## జీవిత సభ్యులు (1987–88)

82. పి. శుభ, బెంగుళూరు
83. రంధి సోమరాజు, విశాఖపట్టణం
84. డా. జి. సోమరాజు, తణుకు
85. ఎ. వెంకటరమణప్రసాద్, కాళసముద్రం (కదిరి)
86. ఆచార్య రవ్వా శ్రీహరి, హైదరాబాదు
87. ఎ. గురుమూర్తి, బోడిగుట్లపల్లి, చిత్తూరు జిల్లా
88. పడాల రామకృష్ణారెడ్డి, భీముని పట్నం
89. డా. యస్. శమంతకమణి, మద్రాసు
90. డా. యస్. అక్కిరెడ్డి, మద్రాసు
91. కె. ఎర్రిస్వామి రెడ్డి, బళ్ళారి
92. డా సి. వసుంధరా రెడ్డి, హైదరాబాదు

93. వి. ఆర్. విద్యార్థి, వరంగల్
94. ఎం. జి. జగన్నాథరాజు, రాజపాళయం
95. దేవరాజు మహారాజు, హైదరాబాదు

ప్రత్యేక సభ్యులు (1987-88)

55. యస్. రఘునాథ, గౌనిపల్లి, కోలారు జిల్లా
56. ఆచార్య సి. సూర్యనారాయణ, వారణాసి
57. వి. రుక్మిణి, వారణాసి
58. జి. యమ్. కె. శర్మ, వారణాసి
59. డా. బయ్యా రత్నావళి, వారణాసి
60. ఆచార్య శలాక రఘునాథ శర్మ, అనంతపురం
61. గ్రంథాలయాధికారి, బెంగుళూరు విశ్వవిద్యాలయం
62. సి. శ్రీనివాస్, కళ్యాణదుర్గం
63. దేవత వెంకటాచలపతి, ధర్మవరం
64. జానమద్ది హనుమచ్ఛాస్త్రి, కడప
65. అవ్వారి కృష్ణశర్మ, బెంగుళూరు
66. తోట వెంకటస్వామి, చిలకలూరి పేట
67. టి. గౌరీశంకర్, హైదరాబాదు

# చైతన్య కవిత

విభవ శరత్తు **6** AUTUMN 1988



దేవులపల్లి శ్రీశ్రీ

భావరవి–విప్లవరవి విశిష్టసమాగమం